


## ఆంజనేయులు మాకినీడి

ఎక్కౌంట్స్ ఆఫీసర్ (రిటైర్డ్), ట్రెజరీ అండ్ ఎక్కౌంట్స్ డిపార్ట్‌మెంట్

డో. నెం. 3-252, రోడ్ నంబర్ : 3

గంగరాజునగర్

**కాకినాడ - 533 005.**

ఫోన్ : 0884 - 2351058

మాకినీడి ఆంజనేయుని

# చిత్ర కళా స్రవంతి



చిత్రకారుడు :

## మాకినీడి ఆంజనేయులు



వివరణ :

## మాకినీడి సూర్యభాస్కర్



# కళాస్రవంతి - ఆంజనేయులు

సంప్రదాయం .... ఆధునికత !

ఒకదానికొకటి విరుద్ధాలైనట్లు జమిలిగా ఉపయోగించే జంట పదాలు.

సంప్రదాయం ఛాందస భావాన్వితమనీ, నిర్హేతుకమనీ, ఆధునికత నవ్యభావ సమన్వితమనీ, సహేతుకమనీ సామాన్యమైన అభిప్రాయం.

సంప్రదాయాన్ని పట్టుకు వేలాడేవారిని సంకుచితులుగా, ముందు చూపు అసలే లేనివారుగా ఈసడిస్తారు ఆధునిక భావుకులు. విశృంఖలంగా స్వైర్వవిహారం చేసే నవభావనా వీచికలు జాతి సంస్కృతీ దీపాన్ని ఆర్పివేస్తున్నాయని తమ చేతులను కాపుగా ఉంచబోతారు సంప్రదాయవాదులు.

అయితే -

సంప్రదాయం ... ఆధునికత ...

పరస్పరం విరుద్ధాలైన భావనలు కానేకావు.

సంప్రదాయపు పునాదిలేని ఆధునికత కుప్ప కూలుతుంది. ఆధునికతలోనికి పరిణమించని సంప్రదాయం సర్జక స్వభావాన్ని కోల్పోయి నిర్జీవమౌతుంది. సంప్రదాయం ఒక జీవ స్రోతస్విని. ఎప్పుడూ ప్రవహించే గతిశీలత దాని లక్షణం. అయినప్పుడే సంప్రదాయం గతానుగతికంగా మారి నూతనభావనాబలాన్ని కూర్చుకుని జాతి సంస్కృతిని

సజీవంగా మలచగల ఆధునికతగా అలరారుతుంది. లేదంటే అది ఆధునికత కాబోదు. కేవలం వెర్రి తలలు వేసే పైశాచికత్వమే కాగలదు.

సంప్రదాయాన్ని ప్రవహింపజేసి దానికి గతిశీలత కల్పించేది ప్రయోగం. నిర్మాణ కౌశలంతో కూడిన అట్టి ప్రయోగం ఆధునికతగా రూపొందుతుంది.

సంప్రదాయం ఎప్పటికీ ఎండిపోని జీవనది అయితే, ఆధునికత ఎల్లలు లేని సముద్రం. అందుకే ప్రాయోగిక సంప్రదాయం సృజనాత్మకమైనప్పుడు కళాభివ్యక్తి ఎప్పటికప్పుడే నిత్యనూతనంగా ఉంటుంది. మొన్నటి ఆధునికత నిన్నటికి పాతబడిపోయి అదొక సంప్రదాయంగా స్థిరపడవచ్చు. ఆ నిన్నటి సంప్రదాయం నేటికి నవీకరింపబడి మళ్ళీ అత్యాధునికతగా రూపొందవచ్చు. ఈ అత్యాధునికత కూడ రేపటికి పాతదై తీరుతుంది. సహజాతి సహజమైన ఈ మార్పుల పరిణామం వల్లనే కళాభివ్యక్తి నిత్య నూతనత్వమౌతూ ఉంటుంది.

**సంప్రదాయం ఎప్పటికీ ఎండిపోని జీవనది అయితే, ఆధునికత ఎల్లలు లేని సముద్రం.**

తెలుగు కవిత్వాన్నే తీసుకుందాం. అది ప్రాచీనాంధ్ర కవిత్వం, ఆధునిక లేదా నవ్యకవిత్వం, అతి నవ్య కవిత్వంగా వింగడింపబడింది. ప్రబంధాది కావ్యాలలో సంప్రదాయక భావ భావనాభిరంజకంగా సాగిన కవిత్వం – ఆంగ్ల విద్యావ్యాప్తితో, వ్యవహారిక భాష, స్వదేశీయోద్యమాల నేపథ్యంలో సంఘసంస్కరణోద్యమ స్ఫూర్తితో వస్తు, భావ, శైలీ, నవ్యతలను కూర్చుకొని ఆధునిక కవిత్వమైంది. ఆ తర్వాత అధివాస్తవిక, ప్రతీకాదిగా గల ధోరణులతో అత్యాధునికమైంది. ఇదొక క్రమ పరిణామం.



డిజైన్స్
1972



నిరీక్షణ
1973





పరిష్వంగం
1993

ఏదైనా సంప్రదాయం గతంలో గొప్పదై ఉండొచ్చు. అయితే వర్తమానంలో దాని విశిష్టత ఏ పాటిదో గమనించాలి. ఈ గమనింపును కలుగజేసేది చారిత్రక దృష్టి. ఇది కళాకారునికి అత్యావశ్యకం. కళాకారుడైనవాడు గతాన్ని గతంగా కాక, వర్తమాన దృష్టితో వీక్షించాలి..... సమీక్షించాలి. వర్తమానానికి అనుగుణ్యమైన చారిత్రక దృష్టి నవనవోన్మేషమయ్యే ప్రతిభకు ఆలంబనమౌతుంది.

సంప్రదాయపు ఆలంబన లేనప్పుడు నూత్న నిర్మాణం జరగదు. అలాగని సంప్రదాయ అంధానుకరణ ఆధునికతకు దారి తీయదు. ఈ రెండిటి మధ్య సహేతుకమైన తుల్యస్థితి కొనసాగినప్పుడే కళాభివ్యక్తి ఛాందసమూ కాక, విశృంఖలమూ కాక సమస్థితిలో, సమపాకంతో అలరారుతూ మానసికానందాన్ని కలిగిస్తుంది. అటువంటి తుల్యస్థితిని సాధించిన చిత్రకారుడు మాకినీడి ఆంజనేయులు. ఈయన సంప్రదాయబద్ధమైన చిత్రణాసంవిధానంతో ఆరంభించి పిమ్మట నవ్యభావనా వస్తు స్వీకృతితో ఆధునికతను సంతరించుకొని, చివరికి సంప్రదాయ భావాలను ఆధునిక చిత్రణాభివ్యక్తితో రూపింపచేసి అత్యాధునికతలోనికి పరిణమించారు.

రాశిలో తక్కువైనా, వాసిలో ఎక్కువైన వీరి చిత్రాలను చూసినప్పుడు కాలక్రమంగా సాగిన ఈ పరిణామం ద్యోతకమౌతుంది.



గ్రీటింగ్ కార్డు - 1965




గ్రీటింగ్ కార్డు - 1969

చిన్నతనం నుండే చిత్రకళలో ఆంజనేయులకున్న ఆసక్తి హితులకు, సన్నిహితులకు సాలీనా పంపే గ్రీటింగ్ కార్డులకు పరిమితమైంది మొదట్లో.



డిజైన్ - 1972



"చందన తాంబూలాది"

1973

తూర్పుగోదావరి జిల్లాలోని ద్రాక్షారామకు దగ్గరనున్న ఎర్రపోతవరం గ్రామంలో 1930వ సంవత్సరం, జూలై నెల 15వ తేదీన ధార్మిక భావనకూ, దైవభక్తి పరాయణతకూ, సౌందర్య తత్వాభిరుచికీ పేరెన్నిక గన్న వంశంలో జన్మించారు ఆంజనేయులు. తండ్రి సూరన్న ఆ గ్రామాధికారి. కొన్ని హస్తకళల్లో ప్రవేశమున్నవారూ, కళాహృదయులూనూ. చిన్నతనం నుండీ చిత్రకళలో ఆంజనేయుల కున్న ఆసక్తి హితులకు, సన్నిహితులకు సాలీనా పంపే గ్రీటింగ్ కార్డులకే పరిమితమైంది, మొదట్లో. 1972వ సంవత్సరంలో ఉద్యోగరీత్యా సబ్‌ట్రజరీ అధికారిగా విజయనగరంలో పనిచేస్తూ ఉండిన కాలంలో లభించిన 'చిత్రకళా శిరోభూషణ' అంట్యాకుల పైడిరాజుగారి శిష్యరికం ఆంజనేయుల్ని చిత్రకారునిగా తీర్చిదిద్దింది. అప్పట్లో విజయనగరంలో పైడిరాజు నడిపే చిత్రకళాశాలలో చేరి, ఆయన వద్ద చిత్ర లేఖనంలోని మెళకువల్ని ఆకళింపు చేసుకున్నారు ఆంజనేయులు. వారి మార్గదర్శకత్వంతో 1973లో ఆంజనేయులు రచించిన **హరహర మహదేవ్** చిత్రం,

"చిత్రకళాశిరోభూషణ" అంట్యాకుల పైడిరాజుగారి శిష్యరికం ఆంజనేయుల్ని చిత్రకారునిగా తీర్చిదిద్దింది. ఆయన వద్ద చిత్రలేఖనంలోని మెళకువల్ని ఆకళింపు చేసుకున్నారు.

విశాఖపట్టణం చిత్రకళాపరిషత్‌వారిచే నిర్వహింపబడిన అఖిల భారతస్థాయి చిత్రకళాప్రదర్శనలో మొదటి బహుమతిని పొందింది. తర్వాత 1974లో కాకినాడ చిత్రకళామందిర్ నిర్వహించిన చిత్రకళా ప్రదర్శనలో క్యూబిజంలో ఆంజనేయులు చిత్రించిన **చందన తాంబూలాది** అన్న స్టిల్ లైఫ్ పెయింటింగు కాంస్య పతకాన్ని సాధించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఖజానా పద్దుల చిట్టా ఆవర్జాల నిర్విరామ మదింపుతో కూడిన ఉద్యోగ విధి నిర్వహణ ఆంజనేయులు సృజనాత్మక స్రవంతికి ఆనకట్ట వేసింది. 1988లో అడల్ట్ ఎడ్యుకేషన్ డైరెక్టరేట్‌లో అకౌంట్స్ ఆఫీసరుగా పదవీ విరమణ చేసిన తరువాత తిరిగి కుంచె పట్టి **శ్రీకారం** (1993) తో చిత్రరచనకు పునఃశ్రీకారం చుట్టారు. వృత్తి ప్రవృత్తుల పరస్పర ప్రభావం కళాకారుల విషయంలో పరిహరించలేనిది. వయోజన విద్య ప్రాతిపదికగా రూపొందిన **ఇల్లాలి చదువు - ఇంటికి వెలుగు** అన్న చిత్రం 1994లో జరిగిన కోనసీమ చిత్రకళాపరిషత్ (అమలాపురం), చిత్రకళాసంసద్ (మచిలీపట్నం)ల రాష్ట్రస్థాయి చిత్రకళాప్రదర్శనలలో నగదు బహుమతిని సంపాదించింది. ఆ సందర్భంగా, చిత్రకళాప్రదర్శనలో భాగంగా ఆంజనేయులు చిత్రాల ఒన్‌మాన్‌షోను ఏర్పాటు చేసి, ఆ సంస్థ అధ్యక్షులు, శాసన సభ్యులు డా॥మెట్ల సత్యనారాయణరావు ఆయనను ఘనంగా సన్మానించారు.

స్థూలంగా భారతీయ సాంప్రదాయిక రీతి, పాశ్చాత్య రీతులుగా వీరి చిత్రాలను విభజించవచ్చు. సంప్రదాయ రీతి చిత్రాలను పౌరాణిక, జానపద, సమకాలీన విభాగాలుగాను, పాశ్చాత్యరీతి చిత్రాలను ల్యాండ్ స్కేప్, స్టిల్‌లైఫ్, క్యూబిజం చిత్రాలుగాను తిరిగి విభజించవచ్చు.

భారతీయ సంప్రదాయ చిత్రణా సంవిధానానికి ఆలంకారిక శైలిని జోడించిన చిత్రాలు **సందేశం** (1972), **అలంకరణ** (1973), **నిరీక్షణ** (1974) మొదలైనవి. ఈ చిత్రాలలో అలంకరణ శైలి బహువర్ణీయమై లయాన్వితమైన దృశ్యసంగీతాన్ని పలికిస్తుంది. వీటిలోని రేఖల కూర్పులు రంగుల కాంతితో లయమయమై కంటికి సంగీతాన్ని వినిపిస్తాయి. ఈ చిత్రాలలోని రేఖావర్తులత ముఖ్యంగా వీటికి ఎక్కడలేని సోయగాన్నీ కూర్చుతోంది. సామాన్యంగా వీరి రేఖ నాజూకుతనంతో గొప్ప సౌమ్యతను ప్రదర్శిస్తుంది.

**ఆంజనేయులు చిత్రాలలో అలంకరణ శైలి బహువర్ణీయమై లయాన్వితమైన దృశ్య సంగీతాన్ని పలికిస్తుంది. రేఖ నాజూకుతనంతో గొప్ప సౌమ్యతను ప్రదర్శిస్తుంది.**



**మహాగణపతి**
**1993**

**"మహాగణపతి" చిత్రంలో రేఖలు కత్తుల్లా దూసుకుపోతూ నృత్యలయను కనబరుస్తాయి.**

**మహాగణపతి** (1993) చిత్రంలో రేఖలు కత్తుల్లా దూసుకుపోతూ నృత్యలయను కనబరుస్తాయి.

విశ్వవిఖ్యాత చిత్రకారుడు రాజా రవివర్మ చిత్రం – 'హంస రాయబారం' కలిగించిన స్ఫూర్తితో, ఆ చిత్రనాయిక దమయంతి తెలుగువారి ఆడుబిడ్డ అయితే



**రాయంచ ధవళ ధావళ్యం దమయంతి నల్లని నెరికురుల నడుమ ముడిచిన పూల తెల్లని స్వచ్ఛదనంతో సాధింపబడిన వార్ణికా సమతుల్యత కొట్టవచ్చినట్లు కనబడుతూ అందాన్ని కూర్చే అంశం.**

**సందేశం**
**1972**

ఎలా ఉంటుందన్న ఊహకు రూపం **సందేశం** (1972) చిత్రం. నీలం, మట్టి రంగుల పృష్ఠ నేపథ్యంలో చిత్రింపబడిన రాయంచ ధవళధావళ్యం దమయంతి

నల్లని నెరికుల నడుమ ముడిచిన పూల తెల్లని స్వచ్ఛదనంతో సాధింపబడిన వార్ణికా సమతుల్యత ఈ చిత్రంలో కొట్టవచ్చినట్లు కనబడుతూ అందాన్ని కూర్చే అంశం. హంసకు దమయంతి వివరిస్తున్న ప్రేమ సందేశం ఆమె కళ్ళల్లో ద్యోతకమౌతుంటుంది. చెంపసరాలు, నిడు లోలకులు, పాపిట పిందె మొదలైన ఆభరణాలతో సాలంకృతయైన దమయంతి అచ్చపు పదహారణాల తెలుగు ఆడపడుచుగా సాక్షాత్కరిస్తుంది.

## అలంకరణ

వంటా వార్పూ అయ్యాకా తీరుబడిగా కూర్చొని మధ్యాహ్నం పూట తల దువ్వుకొనే గ్రామసీమల భామ- ఒక చేత పట్టిన అద్దంలో చూసుకుంటూ, ముడిచిన కొప్పులో పువ్వును తురుముకొంటున్న దృశ్యం. 'అలంకరణ' చిత్రం. ఆమె ధరించిన చీర ముడుతలు - పైయెదలోని వాలురేఖలకు వ్యతిరిక్త దిశలోనున్న జారవిడిచిన చెంగులోని వాలురేఖలు ... కూర్చున్నప్పటి ఆమె శ్రోణి వర్తులత, ప్రక్కనే సగభాగం కనిపిస్తూ ఉన్నకుండ వ్యతిరిక్త వర్తులత చిత్రానికొక రేఖీయ వ్యత్యస్త రమ్యతను కూరుస్తాయి.



ధరించిన చీర ముడుతలు - పైయ్యెదలోని వాలురేఖలకు వ్యతిరిక్త దిశలో, జార విడిచిన చెంగులోని వాలు రేఖలు... కూర్చున్నప్పటి శ్రోణి వర్తులత, ప్రక్కనే సగభాగం కనిపిస్తూ ఉన్న కుండ వ్యతిరిక్త వర్తులత 'అలంకరణ' చిత్రానికొక రేఖీయ వ్యత్యస్త రమ్యతను కూరుస్తాయి.



**నీలిమ**

**1994**

ఈయన పుట్టిన కాలానికింకా గ్రామాలపైన పట్టణాల కృతక నాగరిక ప్రభావం పడలేదు. ఆనాటి గ్రామ జీవితాన్ని కొమ్మదాసర్లు, గరగలోళ్లు, బుడబుక్కలవాళ్లు ఆనందపరచేవారు. చిన్ననాడు చూసిన ఆ జానపద కళావేషాలను, విశేషాలను ఆంజనేయులు కుంచె బాగా చిత్రించింది. హరహరమహదేవ్ (1973), అంబా! జగదంబా! (1974), గరగలాట (1923) మొదలైన చిత్రాలన్నీ ఈ కోవకు చెందుతాయి.

# హరహరమహదేవ్

నాగాభరణుడూ, చంద్రరేఖాధరుడూ, సకల స్థావర జంగమాధినాధుడూ అయిన మహేశ్వరుడి వేషభూషణాదుల్ని అనుకరిస్తూ నదీతారల్లో, తీర్థ ప్రదేశాల్లో ఆ మహాదేవుని నామాన్ని కీర్తిస్తూ దర్శనమిచ్చే జంగమ



హరహర మహదేవ్

1973

జంగమదేవర ఫాలఫలకం పైన, కంఠనాళం మీద అడ్డంగా దిద్దిన విబూది రేఖలు అతని ప్రశాంత మానసిక స్థితిని తెలియజేస్తుంటే, ధరించిన పాగా టోపీలోని నిలువు రేఖలు, నిడుదైన నాసిక రేఖ గంభీరతను సూచిస్తూ - అతని ధీర గంభీర ప్రశాంత మనఃస్థితిని తేటతెల్లం చేస్తున్నాయి.

దేవర ఆకృతికి అనుకృతి ఈ చిత్రం. ఆలంకారిక శైలీ సంపద్వంతమైన ఈ చిత్రంలోనున్న అధికమైన అడ్డు, నిలుపు రేఖలు జంగమదేవర వ్యక్తిత్వ సూచితాలు. ముఖ్యంగా ఫాల ఫలకంపైన, కంఠనాళం మీద అడ్డంగా దిద్దిన విబూది రేఖలు ప్రశాంత మానసిక స్థితిని తెలియజేస్తుంటే, అతను ధరించిన పాగా టోపీలోని నిలువు రేఖలు, నిడుదైన నాసిక రేఖ గంభీరతను సూచిస్తూ – వెరసి, జంగమదేవర ధీర గంభీర ప్రశాంత మనః స్థితిని తేట తెల్లం చేస్తున్నాయి.

# అంబా! జగదంబా!!

అలాగే, శీతకాలపు ప్రాతఃకాలాల్లో ఈ నాటికీ కనబడుతూండే జానపద కళావేషధారుల్లో బుడబుక్కల వాడు ఒకడు. ఢమరుకని వాయిస్తూ "అంబ పలుకు ... జగదంబ పలుకు" అంటూ వచ్చే బుడబుక్కలవాడి పార్శ్వ దృశ్యం ఈ చిత్రం. అంబ పలుకును విడమరచి చెప్పడానికి ముందు సాలోచనుడై తాను వింటున్నట్లున్న ఈ చిత్రానికి పృష్ఠనీలంలోని పార్శ్వముఖం ఎంతో నప్పింది.



అంబా! జగదంబా !!

1978

# గరగలాట

అలాంటిదే **గరగలాట** (1993) చిత్రం కూడా. గ్రామ దేవతల ఆరాధనోత్సవాలలో ఆయా దేవతలకు ప్రతీకగా భాసించే కళారూపం.

**'గరగలాట' చిత్రంలోని రూపాల వైయక్తిక భంగిమలలో నున్న విభిన్న మైన కర్తృక రేఖావిన్యాసం సౌష్ఠవ సమూహ రచనలోని విసువుదలను పరిహరించడమే కాకుండ, అందాన్ని కూరుస్తోంది.**



**గరగలాట**
**1993**

ఆంధ్ర జానపదశైలిలో రచింపబడిన సామూహిక సంవిధాన చిత్రమిది. ఈ చిత్రంలో రూపాల స్థాన నిర్దేశం పూర్తి సౌష్ఠవంగా (Symmetrical Composition) ఉంది. చిత్రంలో ఈ విధమైన అమరిక కళానియతి రీత్యా అవాంఛనీయమే అయినా, చిత్రంలోని ఆయా రూపాల వైయక్తిక భంగిమలలోనున్న విభిన్నమైన కర్తృకరేఖా

విన్యాసం సౌష్ఠవ సమూహ రచనలోని విసుగుదలను పరిహరించడమే కాకుండ, అందాన్ని కూడా కూరుస్తోంది. అయితే, ఈ చిత్రంలో పెర్స్పెక్టివ్ ఉంటే ఇంకా అందగించేది.

## రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?



పనికి సంబంధించిన కదలికలలో చిత్రకారుని అవగాహన ఎంతో పరిశీలన మీదట కాని సాధ్యం కానిది.

**"రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?" - 1993**

"జగానికంతా సౌఖ్యం నిండగ, విరామ మెరుగక పరిశ్రమించే కార్మిక ధీరుల ఘర్మజలానికి ఖరీదు కట్టే షరాబు లే" డన్న మహాకవి ఆవేదనకు స్పందనగా మనం

కూడా ... మన కోసం, మన సౌఖ్యం కోసం ... మన గృహ నిర్మాణం కోసం **రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?** (1993) అని ఒకసారి దృష్టిని సారిస్తే కళ్ళకు కట్టే శ్రమైక జీవన సంగ్రామం ఈ చిత్రం – మరొక సమూహ రచన.

ఏకరూప సంవిధానికి, సామూహిక సంవిధానానికి చాలా భేదం. సామూహిక సంవిధానం చిత్రకారుని నేర్పరితనాన్నీ, చాతుర్యాన్నీ పట్టిస్తుంది. శ్రమకు సంబంధించిన వివిధ కార్యక్రమాలలో, భంగిమలలో పొడవైన దేహాలతో నున్న స్త్రీ పురుష మూర్తులు చాల సహజంగా కనబడతారీ చిత్రంలో. పనికి సంబంధించిన కదలికలలో చిత్రకారునికున్న అవగాహన మెచ్చుకోదగింది. ఎంతో పరిశీలన మీదట కానీ సాధ్యం కాదు. రాళ్ళు కొట్టేవాళ్ళు, ఎత్తేవాళ్ళు, మోసేవాళ్ళు, తవ్వేవాళ్ళు, గోడ కట్టేవాళ్ళు – పరిసరాలను, ఆఖరికి తమను తామే మరచిపోయి పనిలో తాదాత్మ్యం చెందిన శ్రామికులను చూస్తే వాళ్ళే నిజమైన కర్మయోగులన్న భావం కలుగుతుంది. దీక్ష ఉంటేనే కానీ ఏ నిర్మాణాత్మకమైన పనీ సాగదనే నిజాన్ని చాటి చెబుతుందీ చిత్రం.

ఈ చిత్రమనే కాదు, ప్రతి చిత్రంలోను సాధారణ రీతికంటె పొడవైన మూర్తులు మనకు కనబడతాయి. చిత్రకారునికి పొడవైన దేహంపట్ల మక్కువనిపిస్తుంది. చిత్రకారుడు మరీ పొట్టి కాకపోయినా, పొడుగరి కాకపోవడం కొంత కారణం కావచ్చు.

## సారాంతకం (నాంది)

సంపూర్ణ మద్యనిషేధానికి ఆంధ్రనారీలోకం నడుం కట్టి, పిడికిలి బిగించి ఇచ్చిన పిలుపుకు దృశ్యరూపం ఈ చిత్రం.



**సారాంతకం**
**1994**

మద్యం మత్తులో పీకల వరకు మునిగిపోయాడో ప్రబుద్ధుడు. బయటికి లాగడానికి విఫల ప్రయత్నం

చేస్తున్నాడతని తండ్రి. లబోదిబోమంటోంది తల్లి. బావురుమంటున్నారు పిల్లలు. భార్యమాత్రం, కృతనిశ్చయంతో పిడికిలి బిగించి కదిలింది. అత్తగార్ని చేయిపట్టి నడిపింది. ఆంధ్రనారీలోకం చేయి చేయి కలిపి సారాంతకాన్ని (నిషేధం) సాధించింది. నీలం రంగు పృష్ఠ భూమితోనున్న ఈ నవమూహ రచన మంచి ప్రణాళికాబద్ధమైన చిత్రరచన.

## ఇల్లాలి చదువు - ఇంటికి వెలుగు



**ఇల్లాలి చదువు**
**ఇంటికి వెలుగు**
**1993**

సంపూర్ణ అక్షరాస్యత సాధింపబడాలంటే, ఆ ఉద్యమం ప్రతి కుటుంబం నుండి ప్రారంభం కావాలనుకునే ఒక ఇల్లాలి కంటికి తన ఇంటిలోనే అక్షరాస్యుడుకాని తన భర్త కనబడ్డాడు. చదువు నేర్చుకోమంది భర్తని. "నేనా?!" అంటూ, "ఈ వయసులోనా!" ఆశ్చర్యపోయాడతడు. "ఎవరు నేర్పుతారు?" తెలివిగా ప్రశ్నించాడు. బదులుగా "నేనున్నా" నందా ఇల్లాలు. సంపూర్ణ అక్షరాస్యత సాధింపబడుతోందా ఇంటిలో ... అలాగే దేశంలో !

సందేశాత్మకాలైన ఈ చిత్రాల వస్తు వైవిధ్యంలో భేదం గమనీయం. సామాజిక, పౌరాణిక, పారలౌకిక పల్లీయ జానపద వస్తువరణం, సంప్రదాయాలంకారిక పాశ్చాత్య శైలీ వైవిధ్యంతో కూడుకుని చూపరులకు విసుపు కలిగించవు ఆంజనేయులు చిత్రాలు.

మొదట్లో తీసుకున్న సంప్రదాయ వస్తువరణం, దానికి తోడు ఆలంకారిక శైలీ నిర్వహణతో కూడిన రచనా సంవిధానం చిత్రకారుని శుద్ధ కళాభావనను తెలియజేస్తే అనంతర కాలంలో గీసిన చిత్రాల వస్తు స్వీకృతిలో 'కళ సమాజం కోసం' అనే నైతిక కళాభావన ద్యోతకమౌతుంది.

ఈ మార్పుకు మరో మంచి ఉదాహరణ **ప్రగతి** (1993) అనే చిత్రం.

# ప్రగతి

తన పిల్లవాణ్ణి పాఠశాలకు తీసుకువెడుతున్న రైతు, వారిని ఆనందంగా చూస్తున్న ఇల్లాలు. గ్రామ్య వాతావరణం. ఇదే ప్రగతి – గ్రామాలలో సైతం పిల్లల విద్యపట్ల ఆదరణ పెరిగిందనే భావం.

**ఆంజనేయుల చిత్రాలలో ఎక్కువ రంగులను ఉపయోగించరు. అయిదారు రంగులు – తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు, నీలం, ధూసరం. కొన్నింటిలో మట్టి రంగు. వీటి వినియోగంలో నుంచి తుల్యతను సాధించి రమ్యత కూరుస్తారు.**



**ప్రగతి**
**1993**

ఆంజనేయులు చిత్రాలలో ఎక్కువ రంగులను ఉపయోగించరు. కేవలం అయిదారు రంగులు – తెలుపు,

నలుపు, ఎరుపు, పసుపు, నీలం, ధూసరం. కొన్నింటిలో మట్టిరంగు. అయితే, వీటి వినియోగంలో మంచి తుల్యతను సాధించి చిత్రానికి రమ్యతను కూరుస్తారు.

చిత్రణ సంప్రదాయమే అయినా, మారిన వస్తువుతో పాటు నిరలంకారమైన నిసర్గ రచనను ఈ దశలో చూస్తాం. ఆంజనేయులు కళాప్రస్థానంలో ఇది తొలి మజిలీ. ఈ దశలో సమకాలీన స్థితిగతులకు అద్దం పట్టే విధంగా, వాస్తవికతకు దగ్గరగా ఉండేలా చిత్రించడం




**తిరునామం**
**1993**

ఆంజనేయులు కళావిన్యాసమైంది. ఉద్యోగ పదవీవిరమణతో చిక్కిన విరామకాలం ఆంజనేయులు సృజనకు పడ్డ ఆనకట్టను కూలగొట్టింది. **శ్రీకారం** (1993) చిత్రంతో (అట్టమీది చిత్రం.) చిత్రకళకు పునః శ్రీకారం చుట్టి విజృంభించారు. అంతకు ముందువలెనే సంప్రదాయ వస్తు భావనలను సంప్రదాయ పద్ధతిలోనూ చిత్రించారు. **తిరునామం** (1993), **జ్యోతిషామపి తజ్జ్యోతి** (1993), **యత్ర యోగేశ్వరః** (1994) వంటి చిత్రాలు ఇందుకు ఉదాహరణలుగా నిలుస్తాయి.

# జ్యోతిషామపి తజ్జ్యోతిః

కరి మకరితో వెయ్యేళ్ళు పోరి పోరి, డస్సిపోయి, స్వశక్తిపై ఆశలుడిగి దైవశక్తిని శరణు వేడింది. "లోకంబులు, లోకేశులు, లోకస్థులు తెగిన తుది నలోకంబగు పెంజీకటి కవ్వల" నామ రూప రహితమై ఏకాకృతిలో వెలుగుతుండే దైవీశక్తికి రూపకల్పన ఈ చిత్రం. విశ్వానికి వెలుగునిచ్చే అవ్యక్త అభివ్యక్తికి ఆంజనేయులు కూర్చిన కళాభివ్యక్తి. శ్రీమద్భగవద్గీతలోని 13వ అధ్యాయం ( క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం)లోని 18వ శ్లోకం ఈ చిత్ర రచనకు ఆలంబన.



"జ్యోతిషామపి తజ్జ్యోతిః - 1995

శ్లో॥ జ్యోతిషామపి తజ్జ్యోతిః తమసః పరముచ్యతే ।

జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం, హృది సర్వస్యధిష్ఠితమ్ ॥

అది వెలుగులకెల్ల వెలుగు (యదాదిత్యగతం తేజో, జగద్భాసయతే ....ఖిలమ్). భౌతిక ఆధ్యాత్మిక అంధకారానికి అవతల ఉండేది. జ్ఞాన స్వరూపమైనదీ, జ్ఞేయమైనదీ. జ్ఞానమువలననే తెలియబడేది. ప్రతిప్రాణి యొక్క హృద్గుహలోనూ వెలుగుతూ ఉండేదీనూ.

ఇలా చిత్రిస్తూ చిత్రిస్తూ, క్రమేపీ సంప్రదాయ భావాలను సంప్రదాయరీతిలో కాక, ఆధునిక చిత్రణావిధానంలో రూపింప జొచ్చారు ఆంజనేయులు. ఈయన కళాప్రస్థానంలో ఇది మలి మజిలీ.

మహాభారత సంగ్రామాన్ని వస్తువుగా తీసుకుని చిత్రించిన **సంఘర్షణ** (1994), రామాయణాన్ని ఆధారంగా చేసుకుని చిత్రించిన ఆంజనేయ స్వామి లంకాప్రవేశం, సీతాదేవిని కనుగొని రామాంగుళీయకం అందించి, లంకాదహనం చేసి, రాముణ్ణి చేరే సన్నివేశాల చిత్రణ **సుందరకాండ** (1995) ఇందుకు ఉదాహరణలు. ఒక విధమైన ప్రహేళికా నైరూప్యత రామాంగుళీయకంలా ఈ ఆంజనేయునికి ఆధునికరీతి చిత్రణలో మంచి నైపుణ్యం కల్పించేదే, ఆయన కృషి ఇంకా కొనసాగి ఉంటే. అందుకు సాక్ష్యాలుగా తోస్తాయి ఈ రెండు చిత్రాలూ.

**ఒక విధమైన ప్రహేళికా నైరూప్యత రామాంగుళీయకంలా ఈ ఆంజనేయునికి ఆధునికరీతి చిత్రణలోని నైపుణ్యం కల్పించేదే, కృషి ఇంకా కొనసాగి ఉంటే**

# సంఘర్షణ

మహాభారత సంగ్రామ మారణ హోమానికి మూలం - మోతాదును మించిన ధృతరాష్ట్రుని పుత్రవాత్సల్యం ఒకవైపు, ద్రౌపది ప్రతీకారవాంఛ మరోవైపు. ఈ మారణకాండకు ఏనాడో పథకం రచించి, సిద్ధపరచి ఉంచాడు నల్లనయ్య. పంచ పాండవులు అతని చక్రం నుండి వెలువడిన విస్ఫోటాలు మాత్రమే. కౌరవులూ, పాండవులకు జరిగిన ఈ యుద్ధం ప్రతీకగా ధర్మానికీ అధర్మానికీ... నీతికీ అవినీతికీ.... మంచికీ చెడుకీ. ... సృష్టిలోని ద్వంద్వాల విధ్వంస ఘర్షణను సూచిస్తుందీ చిత్రం. ప్రతీక రచనా సంవిధానం (Symbolic Expressio) ఈ చిత్రంలో ప్రతిభావంతంగా ప్రయోగింప బడింది. అలాగే **సుందరకాండ** చిత్రం కూడా. ఈ చిత్రాల్లో వర్ణ ప్రతీకతను (Colour Symbolism) సైతం ప్రదర్శించారు ఆంజనేయులు.

మలి చిత్రాలలో భావాలు కేవల రంగుల రూపాలుగా రెండే ఆయతనాల్లో రూపించబడ్డాయి. ఆధునిక చిత్రణ శీలగుణాలలో ఇది ముఖ్యమైన అంశం. సంప్రదాయ చిత్రణాసంవిధానాన్ని వదలివేసి, భావానుగుణ్యంగా రంగుల్లోనూ, రేఖల్లోనూ ప్రాణం పోసిన నైరూప్య చిత్రాలివి.

**మలి చిత్రాలలో భావాలు కేవలం రంగుల రూపాలుగా రెండే ఆయతనాల్లో రూపించబడ్డాయి.**

ఆంజనేయులు చిత్రరచనాశక్తికి ... ఆసక్తికి ఎప్పటికప్పుడు అడ్డుకట్టలు వేస్తూనే ఉంది విధి - బహు క్రూరమైనది! తదనంతర కాలంలో సహకరించని దృష్టివల్ల బాధాతప్త హృదయంతో తన రంగుల వినూత్న సృష్టికి దూరమైన ఆంజనేయులు జీవించడాన్నే ఒక కళగా మలచుకున్న యశస్వి ... కళాతపస్వి.



"యత్రయోగేశ్వర కృష్ణో" - 1994

ఆధునికరీతిలో వ్యక్తీకరించినా, ఆంజనేయులు చిత్రణకు భారతీయాదర్శ సంప్రదాయమే పునాది.

# పాశ్చాత్య చిత్రణ

పాశ్చాత్యశైలీ చిత్రణకు వస్తే ఎన్నో ప్రకృతి దృశ్యాలు, నిశ్చలన చిత్రాలు, మూర్తి చిత్రాలను చిత్రించారు ఆంజనేయులు.



**లాండ్‌స్కేప్ II - 1972**

వీటిలో రంగుల మిశ్రలేపనంతో పాటు, వెలుగు నీడల మూడవ ఆయతనాన్ని సమర్థవంతంగా

సాధించారు. క్యూబిజం టెక్నిక్‌లో మలచిన **చందన తాంబూలాది** (1972), **వెలుగు** (1993) చిత్రాలు చెప్పుకోదగ్గవి.

వాష్ టెక్నిక్‌లో అధివాస్తవికతను జోడించి చిత్రించిన **ప్రణ(ళ)యం** (1972), **పరిష్వంగం** (1993) మొదలైన చిత్రాలు ఆంజనేయులు సంప్రదాయేతర చిత్రణాభివ్యక్తికి మచ్చుతునకలు.



**ప్రణ(ళ)యం - 1972**

మౌలికంగా సంప్రదాయ కళావేత్తగా ఎన్నదగినవారు ఆంజనేయులు. అయితే, ఆధునిక చిత్రణాభివ్యక్తిని, కళాభావనలను వ్యతిరేకించేవారు కారని కూడా తెలుస్తుంది. సంప్రదాయ భావనలను ఆధునిక విధానంలో వెలయిస్తున్న ఆంజనేయుల నైరూప్య చిత్రణ భారతీయమే కాని తదన్యం కాదు.

ఆధునికరీతిలో వ్యక్తీకరించే ఆంజనేయులు చిత్రణకు భారతీయాదర్శ సంప్రదాయమే పునాది. ఆ విధంగా సంప్రదాయ ఆధునికతల మేలి కలయికతో తనను తాను వ్యక్తీకరించుకున్నారు ఆంజనేయులు.

నవ్యచిత్రణాకాయమందు భారతీయాత్మను ప్రతిష్ఠించిన లబ్ధ ప్రతిష్ఠులైన చిత్రకారులు ... రెండు దశాబ్దాల నిండు కళాస్రవంతి – మాకినీడి ఆంజనేయులు.

**నవ్యచిత్రణాకాయమందు భారతీయాత్మను ప్రతిష్ఠించిన లబ్ధప్రతిష్ఠులైన చిత్రకారులు, ఆంజనేయులు జీవించడాన్నే కళగా మలచుకున్న యశస్వి.... కళాతపస్వి.**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**

**1995**



# Makineedi Surya Bhaskar

POET - CRITIC - ARTIST - ARTCRITIC - ACADEMICIAN - FREE LANCER BIO - DATA AS AN ARTIST & ART - CRITIC

Born on 17-8-1962 at KAKINADA, East Godavari Dist, A.P.

**Parentage** : Smt. M. Saraswati and Sri Ranganayakulu, Asst. Try. Officer (Rtd.)
- Had his artistic talet inherited from his Family Ancestry, for all the members down from the grnd - parental generation, know how to draw and apply colour.

**Brush Name** : *Makineedi.*

**Artistic Work** : Water colur and Tempera paintings 50 and Miniatures on visiting cards 25, some are published in the magazines of A.P.

**Awards** : Kona Seema Chitra Kala Parishat CKP Awards - 1993, 1994, 1995.
South Central Zone Cultural Centre (Nagpur) - 1997
Korasala's Wonder - Art Village - 2003, Art Mitra Award - 2004.

**One-Man Shows** :
- Held in Kakinada by State Teachers' Union (Kakinada town Unit) on 22-2-1998.
- Held by Rotaract on the eve of World Rotaract Day on 13-3-1999.
- Held by Chitra Kala Parishat, Kakinada on 15-5-1999.

**Published Works**: Interested in Art - Criticism and hence published a number of articles on art.
- An Anthology of Articles - Kala Toranam, Pub-by Potti Sri Ramulu Tel. Univ. Hyd, Mar. 1988.
- Mana Chitrakarulu - Series of articles on artists of A.P. in Kala Deepika and Circar Express.
- RAMARAO NUNCHI RAMA RAO Daka - A histrorical survey of Art Realm of Andhra Pradesh starting from the legendary artist Damerla and ending with art- celebrity Padma Sri S.V. Rama Rao.
- Art-School, Weekly lessons on Drawing and Painting.
- Gandhiji's Life (told to children) with Chromatic Silhouttes.

**Monographs** :
- Damerla
- Sanjeev Dev - A lyricist of Nature
- Colourful Lyrics of Aesthetics - Paintings of Dr. P.R. Raju
- Modern Artist endowed with Chromatic Music - Dr. Machiraju
- Promotee of Art and Art-Criticism - Chalasani
- The Lenier Expression is BAPU RAR !
- An Experimentalist par Excellence - Dr. S.V. Rama Rao
- Golden Memory of Chitra Malika of Rao Venkata Rao

**Special Work** : On Makineedi : An Appraisal of Makineedi ( The Artist and Creator) by Sri Rao Venkata Rao (G.D.F.A. Madras) as Drusti - Srusti (An Art - review of Makineedi)

**Member ships** : Kona Seema Chitra Kala Parishat, Amalapuram - Honourary Member
Chitra Kala Samsad, Machilipatnam - Life Member
Himabindu Academy of Art and Literature, Kakinada - Member
Regional Representative of VISWA CHITRAKALA (monthly) for East Godavari Dist. A.P.
Honorary Meber - AASCA (Andhra Artists, Sculptors & Cartoonists Association)

**Address** : # 9-3-6/1 A, Saraswati Nilayam, Gandhinagar, Kakinada - 533 004, East Godagvari Dt., Andhra Pradesh. Ph. : 0884 - 2364421